దహోతవే । నిగమాగమవేద్యాయ నమోనారాయణాయచ । దయా పరాయదివ్యాయ దివ్యమాల్యధరాయచ । ప్రద్యోతనాయవంద్యాయ సత్యసంధాయ తేనమః । దివాకరాయసూర్యాయ శూరాయాంశుమతే నమః। సర్వజీవదయాభూత కారణాయకలాపినే। ఖద్యోతనాయరుద్రాయ విద్యుతేచప్రభావతే । సహస్రాంశువిరాజాయ సర్వదేవ మయాయచ । లోకాయలోకమణయే లోకానాంబాంధవాయచ । పినాకినే చక్రభృతే పుణ్యశ్లోకాయ తేనమః । జనాధారాయ శేషాయ సురశ్రేష్ఠాభివందినే । మనోజవాయజటినే జీవితాంతకరాయచ । దుర్జయాయదురంతాయ సామగానప్రియాయచ।చరాచరస్వరూపాయ సర్వేశాయనమోనమః ॥ నమోనమస్తే జగతాం నివాస జగద్ధితాధార జగత్స్వరూప జగత్ప్రదంగారభవత్సురేశతన్యేవ సర్వాంలయమేష్యతీదం॥ నమోనమః కారణకారణాయ నమోనమః కార్యకరాయభానో । నమోనమస్తే పురుషోత్తమాయనమః పరేశాయహిరణ్యరూప॥ జయభాసురభూతాత్మనే భూతభావనకామద । త్వంకర్తాసర్వలోకానాం హర్తాపాలయితాప్రభో । త్వంసర్వజగతాం యోనిరనాదిస్త్రిజగాంతకృతే । త్వమింద్రస్త్వంయమస్త్వష్టాత్వంరుద్రస్త్వంజలాధిపః । త్వమగ్నిస్త్వంచపవనః త్వంధాతాత్వంప్రజాపతిః। ఋగ్వేదస్త్వంయజుర్వేదస్సామవేదస్త్వథర్వచ । త్వంస్వాహాత్వం వషట్చరః త్వంసదాలోకపావకః । ఇత్యేవంలోకనాథస్య భానోరమితతేజసః । నామ్నాంసహస్రంవిప్రేంద్ర కీర్తితంపరమర్షిణా। విశ్వామిత్రేణమునినా లోకానుగ్రహకాంక్షిణా । షణ్మాసజప్యాత్సిధ్యంతి కామితార్థానసంశయః । కామితార్థప్రదంనౄణాం పుత్రపౌత్రాభివర్ధనం । రాజాగ్నిశత్రువ్యాఘ్ర చోరబాధావినాశనం । ఋణరోగాదిదారిద్ర్య సర్వరోగాపహారకం । వివాహంభూమిలాభంచ ధనరాజ్యాదివర్ధనం। దుష్టకుష్టాదినిర్మూలమాయుర్వర్ధనముత్తమం । మనోరథమహోద్యోగ సర్వయాత్రఫలప్రదం । యఃపఠేచ్ఛృణుయాద్వాపి లిఖేద్వ్యాసమాహితః । తులాపురుషసహస్రేషు సర్వక్రతుషు యత్ఫలం కాశీయాత్రాసు యత్పుణ్యం మహాదానేషుయత్ఫలం । తత్ఫలంసనరశ్రేష్ఠ సంప్రాప్నోతినసం

శయః । సర్వాయుస్సుఖీభూత్వా భుక్త్వాభోగానసేకశః। దివ్యపుష్పక మారుహ్య దేహాంతేషు అవర్జితం । కిన్నరై స్సేవ్యమానస్సన్ సూర్య సాయుజ్యమాప్నుయాత్॥ యతోజగత్ స్థావరజంగమాఖ్యం లయంతి యత్ప్రేష్యతి జీవలోకః । తత్ప్రాకృతం రూప మజాస్యభీష్టం సతోస్మి మాయా మయమప్రమేయం ॥ ధృతపద్మద్వయం భీమ తేజోమండల మధ్యగం । సర్వవ్యాధి ప్రశమనం ఛాయాశ్లిష్ట తనుం భజే॥

ఇతి సూర్య సహస్రనామ స్తోత్రం సంపూర్ణమ్.

---

# అనావృష్ట్యాది దోషపరిహార శాంతిః.



పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ అస్మిన్నామే అస్మిన్దేశే అస్మిన్రాష్ట్రే అనావృష్ట్యాది దోషపరిహారార్థం సస్యస్సువృష్టిసిద్ధ్యర్థం వాపీకూప తటాకాది పరిపూర్తి సిద్ధ్యర్థం ఋష్యశృంగ ఆవాహనాఖ్యం కర్మకరిష్యమాణః పుణ్యాహవాచనాఖ్యం కర్మకరిష్యే। తదంగగణపతి పూజాంకుర్యాత్ । వరుణకలశస్థాపనం కుర్యాత్॥ పురుషసూక్తవిధానేన షోడశోపచార పూజాంకుర్యాత్॥ తదంగ ఋత్విగ్వరణం కరిష్యే॥ ఆదౌ ఆచార్య బ్రహ్మఋత్విగ్వరణం దద్యాత్। ఆదౌ గణపతి ప్రార్థనంకుర్యాత్। శ్లో॥ఋష్యశృంగాయమునయే విభాండకసుతాయవై । నమశ్శాంతాధిపతయే సద్యస్సద్వృష్టి హేతవే। పీవోన్నాం-మసిషా। ఇమంమే-షీః। ఉన్నంభయ-పృథివీం । మిద్యున్మహసో-వర్షంతి । పురోవాతః-భూతరావృథ్వాస్వాహా । పర్జన్యాయ-పురుషీణాం। పర్జన్యోవసోర్ధారా-సంపూరయతి । సమానమే తదుదకం-అగ్నయఇతి। ఏతైర్మంత్రైః ఏకైకస్య అష్టోత్తర శతజపం కుర్యాత్ । సర్వేఋత్విజః జానుదఘ్నంవానాభిదఘ్నంవాజలమధ్యేస్థిత్వావారుణానువాకాన్ సంకల్పపూర్వేణపఠేత్ । కృతవీర్య

సుతో రాజాన్సహస్ర భుజమండలః । అవతారోహ రేస్సాతష్యాత్పాల యేత్పృథివీం మహీం। చంద్రప్రభంపంకజ సన్నివిష్టం పాశాంకుశా భీతి వరందధానం । ముక్తాకలాపాంచిత సర్వగాత్రంధ్యాయేత్ప్రసన్నంవరుణం సువృష్ట్యై॥ ఇతి సర్వేఋత్విజః ప్రార్థ్య । సుబ్రహ్మణ్యాహ్వానంకుర్యాత్ । సుబ్రహ్మణ్యోం ఇతిత్రిః। ఇంద్రాగచ్ఛ-ఉపస్తరణ మసి। ఏహిపర్జన్యత్రిః । ఏహీంద్రత్రిః। ఏహివరుణత్రిః ॥ ఏహిపుష్కలావర్తక మేఘత్రిః । మాంద్రాః। వాశాః-సురాష్ట్రాః। ఇహావర్షయంతు। పర్జన్యోవసోర్ధారా-సంపూరయతి । పుష్కలావర్తకై ర్మేఘైః ప్రవర్షంతు వసుంధరాం । విద్యుద్గర్జితసన్నిద్ధంతోయాత్మానం నమామ్యహం। యస్యకేశేషుజీమూతా నద్యస్సర్వాంగ సంధిషు । కుక్షౌ సముద్రాశ్చత్వార స్తస్మైతోయాత్మనేనమః। సమానమేతదుదకం-దివంజిన్వంత్యగ్నయ ఇతి ॥ ఓంనమోభగవతే వరుణాయ జలాధిపతయే మకరవాహనాయ పాశహస్తాయ విష్ణు భక్తాయ నానాలంకృత మేఘవస్త్రాచ్ఛాదన విద్యుత్ప్రకాశ దీపజ్వాలానోవ్యోమ్నిఘన గర్జిత జీమూతఘోషాలంకృతసర్వ నదీతటాకవాపీకూప సమృద్ధి సంపూర్ణ బ్రహ్మవిష్ణు మహేశ్వర రాజర్షి దేవద్విజగణానాం సకల జీవప్రాణాధార సకల జీవ ఆహారార్థం శీఘ్రమేవ వరుణ ఆగచ్ఛ ఆగచ్ఛ వర్ష ప్రతిబాధం నివారయ నివారయ। వర్షంధారయ ధారయ । వర్షం విముంచయ విముంచయ పశ్చాద్వాతం శమయ శమయ పురోవాతం జనయ జనయ మహావృష్టిం స్రావయ స్రావయ సస్య స్సు వృష్టిం దేహిపర్జన్యోం॥ అస్మిన్గ్రామే అస్మిన్దేశే అస్మిన్రాష్ట్రే అనావృష్టిదోషపరిహారోస్తు॥ సస్యస్సువృష్టి సిద్ధిరస్తు॥ కేచిత్ చతుష్పథే దేవాలయ సన్నిధే సుబ్రహ్మణ్యాహ్వానం కుర్యాత్ । తతఃవారుణాను వాకాన్పఠేత్ ॥ వారుణఅధ్యాయాలు । ఆపఉదంతు । ఉదాయుషా । వాచామేంద్రియేణ । ప్రజాపతిర్యజ్ఞాన్ । ధృవోసీత్యాహ । యోవైసప్తదశం ।, ఇంద్రంవోహవామహే । ప్రజాపతిస్తావరుణం । వషట్కారోసౌ సౌరీంగరుణ మాశ్వీన మింద్రంవోనరః । అగ్నింవాఏతస్య । ప్రజాపతిర్వ

రుణాయ । యూవామింద్రావరుణా । మారుతమసి మరుతామోజః । దేవావసవ్యా అగ్నే । మారుతమసి మరుతామోజఇతి । దేవావసవ్యా దేవాశ్శర్మణ్యాః । అగ్నినారయిం । ఏతద్వాఅపాం । అపాంత్వేమన్ । ఇంద్రాగ్నిభ్యాంత్వా సయుజాయుజా । వృష్టిసనీరుప । జ్యోతిగ్ంషికురుతే । రుద్రోవాఏషః । వసోర్ధారాం జుహోతి । అగ్నిర్దేవేభ్యోపాక్రామత్ । సమీచీనామాసి । హిరణ్యవర్ణాః । అపాంగ్రహాన్ । వారుణోవైక్రీతః । దేవావైయజ్ఞ మాగ్నీధ్రే । అవభృథయజూగ్ంషి । కూప్యాభ్యస్వాహా । అద్భ్యస్వాహా । పృథివ్యైస్వాహా। ఆబ్రహ్మన్ । ఆక్రాన్ వాజీ । జజ్ఞిబీజం । యోవాఅశ్వస్య మేధ్యస్య । బ్రహ్మసంధత్తం । పవమానః । ప్రజాపతిసవితాభూత్వా । ఉత్తరస్యాం వేద్యాం । వసూనాంత్వా । అపాంమోదప్రవణే । యంతునదయః । ఆపోదేవీః । యత్తేగాత్రేణ్ణా । యద్దీక్షే । వా[illegible]వాఅశ్వః । యదశ్వం । తదాహుః । ఏషవైవిభూః । తార్క్ష్యేణ । ఆదిత్యాశ్చ । ప్రజాపతింవై దేవాః పితరం । ప్రజాపతిర్దేవాన్ । ఇయంవాదిసరఘా । కశ్ఛద్వై । యచ్చామృతగ్ం । సర్వాదిశస్సర్వాందివం । అగ్నిశ్చజాతవేదాశ్చేతి ప్రశ్నాంతం జపేత్ । తస్యవై మేఘః । తస్యవైద్యౌ । ప్రజాపతిస్సంభ్రియమాణః । సువర్ణంఘర్మం । సహస్రశీర్‌షా । అద్భ్యస్సంభూతః । భర్తాసన్భ్రియమాణః । అంభస్యపారే । ఆదిత్యోవాఏష ఏతత్ । ఆదిత్యోవై తేజః । పీవోన్నాం ప్రశ్నాంతం జపేత్ । తతః । దశ్శాంతులు-మిత్రోసి-ఇత్యాదిన్యాసపూర్వకసహస్రఘటాభిషేకకాలమందు తటాకంలోగాని ప్రవాహంలోగాని నాభిదఘ్నజల స్థితులయి వారుణ అధ్యాయులు తాను వాకములు చెప్పవలెను। ......నంబీజం । రుంశక్తిః । ణంకీలకం। అస్యశ్రీధ్రువాసుత్వేత్యస్య మంత్రస్య । ఋష్యశృంగఋషిః । అనుష్టుప్ఛందః । వరుణోదేవతా । ఇంద్రప్రీత్యర్థే వర్షప్రతిబంధక నివారణార్థే జపేవినియోగః। ధృవాసుత్వా అంగు-నమః। సుక్షితయః తర్జ-నమః । అస్మాత్పాశంమధ్య-నమః । వరుణోము వో చత్ అనా-నమః । అవోనప్వానా అదితేరుపస్థాత్ కని-భ్యాంనమః । యూయంపాతస్వస్తిభిస్సదానః కరతల-నమః ॥ ఏవంహృదయాది

న్యాసః॥ భూర్భువస్సువరోమితి దిగ్బంధః। ధ్యానం॥ శ్లోకం। ఋష్యశృంగాయమునయే విభాండక సుతాయవై। నమశ్శాంతాధిపతయే సద్యస్సద్వృష్టిహేతవే॥ ధృవాసుత్వాసుక్షితయస్సు పేశస్తోవ్యా 3 అస్మత్పాశం వరుణోము మోచత్। అవోవన్వానా అదితేరుపస్థాద్యూయంపాతస్వ స్తిభిస్సదానః॥ ౧౦౮ యీ మంత్రము జపముచేయవలెను.

శతానువాకక్రమః.

ఎట్లనగా - త్వమగ్నే, త్వమగ్నె ప్రతిపూరుషం ప్రతిపూరుషం రుద్రోవాఏషః। రుద్రోవాఏషః। ఆశుశ్శిశానః। ఋచాంప్రాచీం తేషామసురాణాం। సువర్గాయవా ఏషలోకాయ చియ్యతే యదగ్ని స్తం। సువర్గాయవా ఏషలోకా య దేవరథః। సువర్గాయవా ఏషలోకాయ చీయతేయ దగ్నిర్వ్రజః। అసావాదిత్యోదశరషభాం। సౌరీం। అసౌసోమారాద్రం। ఇంద్రస్య వజ్రోసి వార్త్రఘ్న స్తనూపాః। వసోర్ధారాం। సువర్ణఘర్మం। సహస్రశీర్షా। అన్నబ్రస్సమ్యాభృతః। దశశాంతులు ౧౦ అణోరణీయాని త్రిప్రశ్నాంతం అనగా ఖండలు ౭౦ యిందులో సంహితలోవి ౧౩ పరాయంతలోవి ౪ చిత్తిలోవి 3 నారాయణంలోవి ౭౦। దశశాంతులు ౧౦ మొత్తం ౧౦౦॥

అయ్యా! ఈ శతానువాకములు ప్రత్యేకముగా ముద్రించబోవుచున్నారము - సస్వరసహితముగా ఈ గ్రంథమందు చేర్చినయెడల గ్రంథవిస్తర భయముచే చేర్చనైతిని.

## 1 సంధ్యావందనం.

## 2 విఘ్నేశ్వోపాసనం.

## 3 ఉదకశాంతి.

అయ్యా! ఈ 3 ప్రత్యేక ప్రత్యేకముగా ముద్రింపించినందున ఈద్వితీయముద్రణమునందు గ్రంథవిస్తరభీతిచే చేర్చనైతిని.

సమాప్తము

శ్రీరస్తు.

శ్రీమద్రామాయణే-యుద్ధకాండే

# ఆదిత్యహృదయస్తోత్రమ్.



శ్లో॥ తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయాస్థితమ్।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్॥ ౧
దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్।
ఉపాగమ్యాబ్రవీద్రామ మగస్త్యో భగవా నృషిః॥ ౨

టీక. తతః-అటుపిమ్మట, రణమ్-యుద్ధమును, ద్రష్టుం-చూచుటకు, దైవతైశ్చ-దేవతలతోను, సమాగమ్య-చేరి, అభ్యాగతః-వచ్చిన, భగవాన్-అధికమైన మాహాత్మ్యముగల, ఋషిః-జ్ఞానవంతుఁడగు, అగస్త్యః-అగస్త్యుఁడు, యుద్ధపరిశ్రాంతమ్-పోరునందు అలసినవాఁడును, యుద్ధాయ పోరుకొఱకు, సముపస్థితమ్-వచ్చిన, రావణంచ-రావణుని, అగ్రతః-ముందట, దృష్ట్వా-చూచి, సమరే-యుద్ధమునందు, చింతయా-ఆలోచనతో, స్థితమ్-ఉన్నవాఁడునగు, రామమ్-రాముని, ఉపాగమ్య-సమీపించి, అబ్రవీత్-పలికెను.

తా॥ అంత యుద్ధంబుఁ జూచుటకై దేవతలతోఁ గూడ వచ్చియున్న భగవంతుండును, త్రికాలజ్ఞుండు నగునగస్త్యమహర్షి, రాముండు యుద్ధంబున నలసట నొంది, మఱల యుద్ధంబునకువచ్చి తనముందట నిలుచున్న రావణుంగని, చింతనొంది యుండుటంజూచి, రామునియొద్దకువచ్చి యిట్లని పలికెను.

శ్లో॥ రామ రామ మహాబాహో శృణుగుహ్యం సనాతనమ్।
యేనసర్వా నరీన్ వత్స సమరే విజయిష్యసి॥ 3
ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్।
జయావహం జపం నిత్య మక్షయ్యం పరమం శుభమ్॥ ౪
సర్వమంగళమాంగళ్యం సర్వపాపప్రణాశనమ్।
చింతాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్॥ ౫

టీక. రామ-రాముఁడా! రామ రాముఁడా! (రాముఁడు చింతావిష్టుఁడగుటవలనను ఆదరాతిశయము వలనను కార్యమునందలి యవసరమువలనను రెండుమాటులు రామసంబోధనము చేయఁబడినది) మహాబాహో-పెద్దచేతులు గలవాఁడా! వత్స-

బిడ్డా! యేన-దేనిచేత, సమరే-యుద్ధమునందు, అరీన్-శత్రువులను, సర్వాన్-అందఱను, విజయిష్యసి-జయింపఁగలవో, తత్ (అధ్యాహృతము)-అట్టి, గుహ్యం-రహస్యమును, సనాతనం-అనాదియును, పుణ్యం-పవిత్రమును, సర్వశత్రువినాశనం-సమస్తశత్రువుల నశింపఁజేయునదియు, జయావహం-జయము గలిగించునదియు, నిత్యం-నాశములేనిదియు, అక్షయ్యం-నాశములేని ఫలముగలదియు, పరమం-అధికమైనదియు, శివం-మంగళకరమును, సర్వమంగళమాంగల్యం - సమస్త మాంగళ్యములకును మంగళమును, సర్వపాపప్రణాశనం-సమస్తపాపములను నశింపఁజేయునదియు, చింతాశోకప్రశమనం-మనస్సునందలి దుఃఖమును దేహపీడను బోఁగొట్టునదియు, ఆధివ్యాధులం బోఁగొట్టునదియును, ఆయుర్వర్ధనం-ఆయుస్సును వృద్ధిఁబొందించునదియు, ఉత్తమం-శ్రేష్ఠమునగు, ఆదిత్యహృదయం - ఆదిత్యహృదయసంబంధియైన, సూర్యమండలాంతర్యామియయిన పురుషుండు ఆదిత్యహృదయశబ్దముచేతఁ జెప్పఁబడుచున్నాడు, యఆదిత్యేతిష్ఠన్, యఆదిత్యమంతరోయమయతి, అంతరాదిత్యేమనసాచరంతం యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే, ఇత్యాదిశ్రుతులచేఁ జెప్పఁబడిన అంతరాదిత్యవిద్యచే నుపాసింపఁబడునట్టి పరమాత్మయైన పరమపురుషుఁడు ఆదిత్యహృదయ శబ్దవాచ్యుఁడు, అతని సంబంధమైనదనుట, లేక, ఆదిత్యాంతర్యామి యయిన పురుషుఁడు „ఆదిత్యహృత్„ అనుశబ్దముచేతఁ జెప్పఁబడును, ఆదిత్యహృదంఅయతి-ఆదిత్యహృత్తునుబొందునది కావున, ఆదిత్యహృదయనునటు స్తోత్రముననుపేరుగలిగినది, ఆదిత్యహృదయమను పేరుగల, జపం-స్తోత్రమును, శృణు-వినుము.

తా॥ రామా! రామా! మహాబాహుఁడా! నాయనా! నీవేస్తోత్రము జపించినచో సమస్తశత్రువులను యుద్ధంబున జయింపఁగలవో అట్టి పరమరహస్యంబును సనాతనంబును బవిత్రంబును సమస్తశత్రువుల నశింపఁ జేయునదియు జయప్రదంబును నిత్యంబును అక్షయమైన ఫలముగలదియు పరమ మంగళప్రదంబును సమస్తమంగళంబులకును మంగళంబును, సమస్తపాపనాశంబును ఆధివ్యాధిహరంబును ఆయుర్వృద్ధికరంబును సర్వస్తోత్రంబులలోను ఉత్తమంబునగు పరబ్రహ్మప్రతిపాదకమైన ఆదిత్యహృదయంబను స్తోత్రమును నీకుపదేశించెదను వినుము.

శ్లో॥ రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతమ్ ।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్॥ ౬

టీక. త్వం (అధ్యాహృతము)-నీవు, రశ్మిమంతం-ప్రశస్తములైన కిరణములు

గలవాఁడును, లేక, రశ్మిమంతం - అంతరంగభక్తులు గలవాఁడును, వారలచే నుపాసింపఁబడువాఁడు ననుట, సముద్యంతం - చక్కఁగా నుదయించుచున్నవాఁడును, దేవాసురనమస్కృతం - దేవతలచేతను అసురులచేతను నమస్కరింపఁబడినవాఁడును, వివస్వంతం - తన తేజస్సుచే నితరములయొక్క తేజస్సులను ఆచ్ఛాదించువాఁడును, భాస్కరం- కాంతులఁజేయువాఁడును, సూర్యుడు చంద్రుడు అగ్ని మొదలగువానికిని గాంతి యొసంగువాడు ననుట,అగు, భువనేశ్వరం-లోకములయొక్క నాథుని,సమస్త లోకముల నియమించునట్టి సర్వేశ్వరుని, పూజయస్వ-పూజింపుము, ఈస్తోత్రముచే నారాధింపుమనుట.

తా॥ నీవు సువర్ణవర్ణుండగుటచేఁ బ్రశస్తకిరణములు గలవాఁడును (అంతరంగభక్తులచే నుపాసింపఁబడు వాఁడును) ఉదయమును బొందుచున్నవాఁడును దేవాసురులచే నమస్కృతుండును ఇతర తేజస్సుల నన్నింటిని బరిభవించునట్టి మహాతేజస్సు గలవాఁడును, చంద్రసూర్య ప్రభృతులకును తేజమునొసంగువాఁడు నగు సమస్త లోకనియామకునిఁ బరమాత్మను ఇమ్మహాస్తోత్రముచే నారాధింపుము.

శ్లో॥ సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః॥ ౭

టీక. ఏషః-ఈసూర్యమండలాంతర్వర్తిపురుషుఁడు, సర్వదేవాత్మకః-సమస్త దేవతలకు ఆత్మభూతుఁడు, తేజస్వీ-అధికమైన తేజస్సుగలవాఁడు, రశ్మిభావనః-కిరణములచేత (లోకములకు) కలిగించువాఁడు, లేక, అంతరంగభక్తులను ముక్తులుగాఁజేయువాఁడు,ఏషః-ఈతండు,దేవాసురగణాన్-దేవాసురసమూహములను,లోకాన్-లోకములను, గభస్తిభిః-కిరణములచేత, పాతి-రక్షించుచున్నాఁడు.

తా॥ ఆదిత్యమండలాంతర్వర్తియగు నీపురుషుండు, సమస్త దేవతలకు నాత్మభూతుండు, తనతేజస్సుచే సమస్తతేజస్సులను తిరస్కరించువాఁడు, కిరణంబుల సమస్తలోకంబులకు ఉత్పత్తిస్థితిసంహారంబులు సేయువాఁడు (భక్తులకు మోక్షంబునొసంగువాఁడు) ఈతండె, కిరణంబులచే వర్షాదులుగల్గించి దేవాసురప్రభృతి సమస్తలోకంబులను రక్షించును.

శ్లో॥ ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతిః।
మహేంద్రో ధనదః కాలో యమస్సోమో హ్యపాంపతిః॥ ౮

టీక. ఏషః-ఈతఁడు, బ్రహ్మాచ-చతుర్ముఖుఁడును, విష్ణుశ్చ-విష్ణువును, శివః-,

శివుండును, స్కన్దః - కుమారస్వామియు, ప్రజాపతిః - తొమ్మిదిప్రజాపతులు మహేంద్రః-దేవేంద్రుండును, ధనదః-కుబేరుండును, కాలః - మృత్యువును, యమ యముండును, సోమః-చంద్రుండును (హి, అనునది పాదపూరణార్థము), అపాంపతిః-వరుణుండును.

తా॥ ఈతడే సమస్తదేవతలును శరీరముగాగలవాడు, ఇతండే బ్రహ్మ, ఇత విష్ణువు, ఇతండే శివుండు, ఇతండే కుమారుండు, ఇతండే నవప్రజాపతులును,ఇతం దేవేంద్రుండును, ఇతండే కుబేరుండును, ఇతండే మృత్యువు, ఇతండే యముండ ఇతండే చంద్రుండు, ఇతండే వరుణుండు.

విశేషార్థము:—పూర్వశ్లోకమునందు సర్వదేవాత్మకత్వము చెప్పంబడిన అది యిపుడు వివరింపంబడుచున్నది. "య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" (సూర్యునియందు లోపల హిరణ్మయుండైన ఏయీపురుషుండు చూడంబడుచున్నాండో) అని శ్రుతియందుం బరమయోగులచేం జూడంబడువాడుగాం జెప్పంబడుటం జేసి, పురోవర్తివాచకమైన ఏతచ్ఛబ్దముచే నిర్దేశము చేయంబడినది. ఏషః ఈతండు, బ్రహ్మాచ-చతుర్ముఖశరీరుండు, చతుర్ముఖాంతర్యామియీతం డనుట,ఇట్లు ముందును తెలియునది. విష్ణుశ్చ-విష్ణువును, శివః-శివుండును, స్కన్దః-"స్కన్దిర్ గతిశోషణయోః"అను ధాతువునం బుట్టినది, శత్రువులను శోషిల్లంజేయువాడనుట, ప్రజాపతిః-"ప్రజాపతిశ్చరతిగర్భే అన్తః" (గర్భమునందు లోపలం బ్రజాపతి విహరించును) అను శ్రుతియందుం జెప్పంబడిన ప్రజాపతిస్వరూపుండనుట. మహేంద్రః-(మహాన్ ఇంద్రః) స్వరూపమునందును ఐశ్వర్యమునందును అవధిలేనివాండు. ధనదః "అన్నాదో వసుదః" అని శ్రుతియందుం జెప్పంబడిన ప్రకారమున సమస్తఫలము నొసంగువాండనుట. కాలః-జగత్సంహారము సేయువాండు, "కాలాయమహాగ్రాసాయవై నమః" అనిశ్రుతియందును 'అత్తాచరాచరగ్రహణాత్' అని శారీరకమీమాంసాసూత్రమునందుం జెప్పంబడినకాలరూపుండు 'అనాదిర్భగవాన్ కాలః, అని పరాశరమహర్షిచేం జెప్పంబడినది. యమః-శిక్షించువాండు, పాపులశిక్షించువాండనుట. సోమః-(అమృతం)సూతే, అమృతమనంగా మోక్షము దాని నొసంగువాండు.అపాంపతిః-జలములకు నాథుండు, 'ఆపోనారా ఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః, తాయదస్యాయనం పూర్వం తేన నారాయణస్మృతః" (జలములు నారము లని చెప్పబడినవి, ఏలయనంగా— జలములు నరునివలనంబుట్టినవి, అజలములు ఈయనకు

పూర్వము స్థానమయ్యెఁ గావున ఈతఁడు నారాయణుఁ డనఁబడెను)అనియు 'ఆప ఏవససర్జాదౌ' (మొదట జలమునే సృజియించెను) అనియు నుండుటవలన, మొదట జలమును సృజియించి యందు నివసించునట్టి నారాయణరూపుఁ డగుట.

శ్లో॥ పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః।
వాయుర్వహ్నిః ప్రజాప్రాణ * ఋతుకర్తా ప్రభాకరః॥ ౯

టీక. ఏషః(అధ్యాహృతము)-ఈతఁడు; పితరః-అగ్నిష్వాత్తాది పితృదేవతలు; వసవః-అష్టవసువులు; సాధ్యాః - సాధ్యులు ('హి' అనునది పాదపూరణార్థము); అశ్వినౌ-అశ్విదేవతలు; మరుతః-ఆవహాదివాయువులు; మనుః-మనువు; వాయుః-భూలోకమునందలి వాయువు; వహ్నిః-అగ్ని; ప్రజాప్రాణః-జనులయొక్క ప్రాణము; ఋతుకర్తా-ఋతువులను జేయునట్టి; ప్రభాకరః-సూర్యుడు; మహేశ్వరతీర్థ పక్షము నందు; ఋతుః-అందఱిచేతను బొందఁబడునట్టి వాడు; కర్తా-చేయువాడు.

తా॥ ఈతఁడె పితృదేవతలు; ఇతఁడే అష్టవసువులు; ఇతఁడే సాధ్యులు; ఇతఁడే యశ్విదేవతలు; ఇతఁడే మరుత్తులు; ఇతఁడే మనువు; ఇతఁడే వాయువు; ఇతఁడే యగ్ని; ఇతఁడే వసంతాది ఋతువులకుఁ గారణమైన సూర్యుండు;(సమస్త కార్యములకును బ్రేరకుఁడు; సూర్యుఁడు).

విశేషార్థము:—పితరః-పితృదేవతలు, పితరులయొక్కయు నంతర్యామియైన వాఁడగుట, వసవః-(సదావసంతి) ఎల్లప్పుడునుండువారలు. 'ధ్రువోధర స్తథాసోమ ఆపోవైశ్వానరోనిలః, ప్రత్యూషశ్చ ప్రభావశ్చ వసవోష్టౌ ప్రకీర్తితాః'(ధ్రువుఁడు ధరుఁడు సోముఁడు ఆపుఁడు వైశ్వానరుఁడు అనిలుఁడు ప్రత్యూషుఁడు ప్రభావుఁడు అని వసువులు ఎనమండ్రుగాఁ జెప్పఁబడినారు.) లేక, 'అగ్నిశ్చపృథివీచ వాయు శ్చాంతరిక్షంచ ఆదిత్యశ్చద్యౌశ్చ చంద్రమాశ్చ నక్షత్రాణిచ ఏతేవై వసవః' అను శ్రుతివలన అగ్నిప్రభృతులు అష్టవసువులు సాధ్యాః-(సిద్ధి రేషామస్తి) సిద్ధిగలవారలు. 'మనుర్మంత్రః ప్రాణదశ్చ చేతయానశ్చ వీర్యవాన్, విత్తిర్జయోనశ్చైవ హంసో నారాయణ స్తథా, ప్రభవోథ విభుశ్చైవ సాధ్యాద్వాదశజజ్ఞిరే.(మనువుమంత్రుండు ప్రాణుఁడు చేతయానుండు వీర్యవంతుండు విత్తి జయుండు నయుండు హంసుండు నారాయణుండు ప్రభవుండు విభువు అని పండ్రెండుగురు సాధ్యులు జన్మించిరి).

* 'ఋతుఃకర్తా' ఇతి మహేశ్వరతీర్థ పాఠః.

అశ్వినౌ-ఆడుగుఱ్ఱముయొక్క రూపముదాల్చిన సూర్యభార్యయగు సంజ్ఞాదేవికిని మగగుఱ్ఱముయొక్క రూపునొందిన సూర్యునకును బుట్టినవారలు, మరుతః-వాయుపురాణమునందు జెప్పఁబడిన శుక్లజ్యోతిరాజులు నలుబదితొమ్మండుగురు. మనుః-మననము సేయువాఁడు, 'నాన్యోతోఽస్తిమంతా' (ఇతనికన్న నితరుఁడు మననము సేయువాఁడు లేడు) అని శ్రుతి, సృష్టికిఁబూర్వము ప్రపంచవిషయకమననము గలవాఁ డనుట, వాయుః-(వాతి) సమస్తమును వాసనగలదిగాఁ జేయువాఁడు. వహ్నిః - వహతి (హవ్యం)-దేవతలహవిస్సును గొనిపోవువాడు, లేక, హుతమయిన హవిస్సును వహించువాఁడు, గ్రహించువాఁ డనుట- 'ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం విశ్వంబిభర్తి భువనస్య నాభిః తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః (ఏదిభువనమునకు నాభిభూతమై పుట్టినదియు పుట్టుచున్నదియు నగు సమస్తమైన యిష్టాపూర్తమును భరించుచున్నదో, అదియే యగ్ని, అదియే వాయువు, అదియే సూర్యుఁడు, అదియే చంద్రుఁడు) అని శ్రుతి. ప్రజాప్రాణః-ప్రజలకుఁ బ్రాణహేతువు, కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందోనస్యాత్' (ఆనందరూపమైన ఆకాశము అనఁగా బ్రహ్మము లేనియెడ, ఎవఁడు ప్రాణము గలవాఁడగును?) అని శ్రుతి. ఋతుః-(అర్యతే) పొందఁబడువాఁడు, తెలియఁబడువాఁడు. 'ఋతుస్సుదర్శనః కాలః' అని సహస్రనామస్తోత్రము. కర్తా-చేయువాఁడు, సమస్తభూతంబులయందును అంతఃప్రవిష్టుండై సమస్తకర్మలకును బ్రేరకుఁడు'ధియోయోనః ప్రచోదయాత్' ఎవ్వఁడు మాబుద్ధులం బ్రేరించునో) అని శ్రుతి. మఱియు,'అంతఃప్రవిష్టం కర్తారమేతం, అథరథాన్ రథయోగాన్ పథస్సృజతే, సహికర్తా, సర్వకర్మా' (లోపలఁ బ్రవేశించిన కర్తయగు నితని, మఱియు రథంబులను రథములతోఁగూడిన మార్గములను సృజించును, అతఁడుగదా కర్త, సమస్తకర్మములు గలవాఁడు.) అను శ్రుతులును బ్రమాణములు. ప్రభాకరం-ప్రభాంకరోతి, వెలుతురు అనఁగా జ్ఞానమును జేయువాఁడు, జ్ఞానము నొసంగువాఁడనుట, 'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్, దదామిబుద్ధియోగంతం యేనమాముపయాంతితే' (అట్లు ఎల్లప్పుడును యోగము నవలంబించి, ప్రీతితో నన్నుభజించువారలకు, దేనిచే వారలు నన్నుఁ బొందఁగలరో, అట్టి జ్ఞానయోగమును నేనొసంగుదును) అని భగవద్గీతలు.

# స్తోత్రప్రారంభః.

శ్లో॥ ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
* సుపర్ణ స్తపనో భాను ర్హిరణ్యరేతా దివాకరః ॥ ౧౦

టీక. త్వం-(ఇచ్చటఁ బ్రథమాంతశబ్దములకుఁ బ్రతిశబ్దమునకును 'త్వం' అని యధ్యాహారము) నీవు, ఆదిత్యః-అదితియొక్క పుత్రుఁడవు, లేక, అదితియనఁగా అఖండితమైన భూమి, దానికి నాథుఁడవు, లేక, సర్వంఆదత్తే-అన్నిటిని గ్రహించువాఁడవు, యస్మాత్సర్వమాదత్తే తస్మాదాదిత్యః, (ఎందువలన అన్నిటిని గ్రహించుచున్నాఁడో అందువలన ఆదిత్యుఁడు) అనిశ్రుతి, భూమియందలి సమస్త రసమును గ్రహించువాఁ డనుట, లేక, జీవరూపంబున సమస్తవిషయంబుల భుజించువాఁడవనుట. సవితా-(జగత్)సూతే, జగత్తునుగలిగించువాఁడవు సూర్యః-సువతి(జనాన్ కర్మణి) జనులను కర్మయందుఁ బ్రేరించువాఁడవు, ధియో యోనః ప్రచోదయాత్, అనిశ్రుతి. ఖగః-ఖేగచ్ఛతి, ఆకాశమునందిరుగువాఁడవు, లేక, ఖంగచ్ఛతి, దహరాకాశమును బొందినవాఁడవు,ఉపాసకులచే దహరాకాశమున జూడఁబడువాడవనుట. పూషా-పుష్ణాతి, జగత్తును బోషించువాఁడవు, స్థితికర్తవనుట. గభస్తిమాన్-ప్రశస్తములయిన కిరణములు గలవాఁడవు, లేక, గభస్తియనగా సర్వవ్యాపినియగులక్ష్మి, అది గలవాఁడవు, లక్ష్మీవంతుఁడ వనుట. 'యథాసర్వగతో విష్ణు స్తథైవేయం ద్విజోత్తమః'. (బ్రాహ్మణోత్తముఁడా! ఎట్లు విష్ణువు సర్వమునుబొందినవాఁడో అట్లే ఈలక్ష్మియు సర్వమును వ్యాపించియుండును.) అని పరాశరమహర్షిచేఁ జెప్పఁబడినది. సుపర్ణః-మంచిపర్ణములు అనఁగా ఱెక్కలుగలవాఁడవు, పరమాత్మవనుట, ద్వాసుపర్ణా సయుజా సఖాయా, (ఇద్దఱు సుపర్ణులు కూడనుండువారలును స్నేహితులును) అనిశ్రుతి జీవాత్మపరాత్మలను నిర్దేశించుచున్నది. తపనః - తపింపఁజేయువాఁడవు. పాఠాంతరపక్షమునందు, సువర్ణసదృశః-బంగారముతో సమానుఁడవు. 'హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖా త్సర్వఏవసువర్ణః' (బంగారుమీసములుగలవాఁడును బంగారు వెండ్రుకలుగలవాఁడును గోళ్లుమొదలుకొని సమస్తశరీరమును సువర్ణవర్ణము) అనిశ్రుతి. భానుః-ప్రకాశించువాఁడవు, హిరణ్యరేతాః - బంగారువికారమైన

---

* 'సువర్ణ సదృశో భానుః' ఇతి పాఠాంతరమ్.

రేతస్సుగలవాఁడవు, కారణమైన రేతస్సు హిరణ్మయమనుట కార్యము హిరణ్మయమని తెలుపుటకొఱకు, హిరణ్మయమైన బ్రహ్మాండమును సృజించినవాఁడ వనుట, 'అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్ । తదండ మభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్' (మొదట జలములనే సృజించెను, అందు వీర్యము నుంచెను, అది సూర్యసమానమైన కాంతిగల హేమవికారమైన యండమయ్యె) అని మనుస్మృతి. దివాకరః-పగటినిజేయువాఁడవు, లేక, దివాద్యుతింకరోతి, వెలుతురును జేయువాఁడవు, అజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానము నొసంగువాఁడ వనుట 'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ । దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే' అని భగవద్గీతలు.

శ్లో॥ హరిదశ్వ స్సహస్రార్చి స్సప్తసప్తి ర్మరీచిమాన్ ।
తిమిరోన్మథన శ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥౧౧

టీక. త్వం(అధ్యాహృతము)-నీవు, హరిదశ్వః-ఆకుపచ్చనివన్నెగలగుఱ్ఱములు గలవాఁడవు, లేక, హరిత్-హరతి (మనః) మనోహరమైన, అశ్వాః-వాహనములుగలవాఁడవు, వృషభగరుడాది మనోహరవాహనములుగల పరమేశ్వరుఁడవనుట. సహస్రార్చిః-వేయికిరణములుగల వాఁడవు, లేక, అర్చ్యతే ఇతిఅర్చిః, అర్చిః అనుటచేఁ బూజనీయమైన మంగళగుణము చెప్పఁబడుచున్నది, వేయిమంగళగుణములు గలవాఁడవు, లెక్కకు మీఱిన కల్యాణగుణములు గలవాఁడవనుట. సప్తసప్తిః - సప్తయను గుఱ్ఱముగలవాఁడవు, 'ఏకో అశ్వో వహతి సప్తనామా' (ఒకగుఱ్ఱము సప్తయనుపేరు గలది వహించుచున్నది) అని శ్రుతి, సప్తయనుగుఱ్ఱముగల యాదిత్యున కంతర్యామి వనుట. మరీచిమాన్-ప్రశస్తకిరణములుగలవాఁడవు, మ్రియంతే శత్రవః అనేన-దీనిచే శత్రువులు చత్తురు, అని, మరీచియనఁగా చక్రము, అదిగలవాఁడవనుట, చక్రము ఇతరాయుధోపలక్షకము, శంఖచక్రగదాధరుండవనుట. తిమిరోన్మథనః - చీకటిని బోఁగొట్టువాఁడవు, లేక, తిమిరమనఁగా జ్ఞానోత్పత్తిప్రతిబంధకమైన దోషము, దాని బోఁగొట్టువాఁడవు, జ్ఞానము గలిగించువాఁడవనుట, శంభుః-శంభవత్యస్మాత్, సుఖము గలిగించువాఁడవు, త్వష్టా-త్వక్షతి, సమస్తనామరూపములను సంహరించువాఁడవు, మార్తాండః - మృతే అండే జాతః, బ్రహ్మాండము మృతము కాఁగాఁ బుట్టినవాఁడవు, బ్రహ్మాండము ప్రలయము నొందినపుడు మరల సృజించుటకై యున్నవాఁడవనుట, లేక, మృతంఅండంజీవయతి, ప్రలయము నొందిన బ్రహ్మాండమును మరల జీవింపఁజేయు

వాడవు, సృజించువాడవనుట, అంశుమాన్ - ప్రకృష్ట కిరణములుగలవాడవు, లేక, అంశుశబ్దము, అంశువ్యాప్తౌ, అను ధాతువువలన బుట్టినది, అంశువనఁగా వ్యాప్తి అది గలవాడవు. ప్రపంచము లోపల వెలుపల నంతటను వ్యాపించినవాఁడవనుట, 'అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణః స్థితః' (దానినంతయు, లోపల వెలుపలను వ్యాపించి నారాయణుం డున్నాఁడు) అని శ్రుతి.

శ్లో॥ హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః ।
అగ్నిగర్భో దితేః పుత్ర శ్శంఖ శ్శిశిరనాశనః॥ ౧౨

టీక. త్వం(అధ్యాహృతము)-నీవు, హిరణ్యగర్భః-బంగారువికారమైన అండము గర్భమందుఁగలవాఁడవు, హిరణ్మయబ్రహ్మాండమును సృజించినవాఁడ వనుట, 'అపఏవస సర్జాదౌ తాసువీర్యమపాసృజత్, తదండమభవద్ధైమం సహస్రాంశు సమప్రభమ్' అని మనుస్మృతి, లేక, హిరణ్య-హితమును రమణీయమును అయిన, గర్భః-అంతఃకరణము గలవాఁడవు, భక్తులకు మేలొసంగునది కావున రమణీయమైన హృదయముగలవాఁడవనుట, లేక, హిరణ్య-జీవసమూహము, గర్భః-కడుపునఁ గలవాడవు, శిశిరః-చల్లనివాఁడవు, తాపత్రయతప్తులతాపముఁ బోఁగొట్టి సుఖము గల్గించువాడవనుట, తపనః - తపింపఁజేయువాడవు, భక్తులయొక్క శత్రువులకు సంతాపముఁ గలుగఁజేయువాడ వనుట, భాస్కరః-ప్రకాశము సేయువాఁడవు, సర్వవస్తువులను దెలియుటకు కారణభూతుఁడవనుట, రవిః-రౌతి, శబ్దించువాఁడవు, వేదముల బ్రహ్మదేవునకుపదేశించినవాఁడ వనుట, 'యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై'(ఎవఁడు ఆబ్రహ్మదేవునికొఱకు వేదముల నుపదేశించెనో) అనిశ్రుతి, లేక, రూయతే ఇతి రవిః-వేదములచేత చెప్పఁబడువాఁడవు, లేక, భక్తులచేత స్తుతింపఁబడువాఁడవు, అగ్నిగర్భః-పగటియందు అగ్నిగర్భమందుఁ గలవాఁడవు, 'ఉద్యంతంవా ఆదిత్యమగ్నిరనుసమారోహతి' (అగ్ని ఉదయించుచున్న సూర్యునిపొందును) అనిశ్రుతి, లేక, అగ్నిగర్భః-కాలాగ్నిరుద్రుఁడు గర్భమందు గలవాఁడవు, 'నారాయణాద్రుద్రో జాయతే' నారాయణునివలన రుద్రుఁడుపుట్టును) అని శ్రుతి. అదితేః-అదితిదేవియొక్క, పుత్రః-కొడుకవు లేక, అదితిపుత్రుఁడవుగా నవతరించినవాఁడ వనుట, లేక, అదితేః-అదితియొక్క, పుత్రః - పురుషుఁడైన కొడుకును అనగా నింద్రుని రక్షించినవాడవు, శంఖః-శామ్యతి, ప్రళయకాలంబున నిర్వ్యాపారముగా శాంతుడవగువాడవు, లేక, శంఖేయస్యసః-సుఖము హృదయాకాశమందు గలవాడవు, ఎల్లప్పుడును ఆనం

దము గలవాడ వనుట, శిశిరనాశనః-మంచును బోగొట్టువాడవు, సూర్యమండలాంతర్వర్తి యగుటచే సూర్యకిరణంబుల మంచును బోగొట్టువాడ వనుట.

శ్లో॥ వ్యోమనాథ స్తమో భేదీ ఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టి రపాం మిత్రో * విన్ధ్య వీథీ ప్లవంగమః॥ ౧౩

టీక. త్వం(అధ్యాహృతము)-నీవు, వ్యోమనాథః-ఆకాశమునకు ప్రభుండవు, ఆకాశమునందుండువాడవనుట, లేక, ఆకాశమును సృజించినవాడవనుట 'ఆత్మన ఆకాశస్సంభూతః' (ఆత్మవలన ఆకాశము పుట్టినది) అని శ్రుతి. తమోభేదీ-చీకటిని బోగొట్టువాఁడవు, లేక, రాహువును భేదించువాఁడవు గ్రహణమున రాహువుచే మ్రింగఁబడి యతని భేదించుకొని వెలువడువాడవు, అట్టి సూర్యుని యంతర్యామివనుట, లేక, భక్తులయొక్క తమోగుణమును బోగొట్టువాడవనుట ఋగ్యజుస్సామపారగః-ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అను వేదములయొక్క పారమును బొందినవాడవు, సమస్త వేదముల యొక్క పర్యవసానమగు, సమస్తవేదముల చేతను తెలియదగినవాడవనుట 'వేదైశ్చసర్వైరహమేవ వేద్యః' (సమస్త వేదముల చేతను నేనే తెలియఁదగినవాడను) అని శ్రుతి, లేక, ఋగ్యజుస్సామవేదముల చేత ఆకాశముయొక్క పారమునొందువాఁడవు 'ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే, యజుర్వేదేతిష్ఠతిమధ్యే అహ్నః, సామవేదేనాస్తమయే మహీయతే, వేదైరశూన్య స్త్రిభిరేతిసూర్యః' (సూర్యుఁడు ప్రాతఃకాలమున ఆకాశమునందు ఋగ్వేదముచేఁ బొందఁబడును, మధ్యాహ్నమునందు యజుర్వేదంబున నుండును, సాయంకాలమునందు సామవేదముతో మహితుండగును) అని శ్రుతి. ఘనవృష్టిః-అధికమైనవర్షముగలవాడవు, అధికమైనవర్షము గురిపించువాఁడవనుట 'అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్య ముపతిష్ఠతే, అదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజాః' (అగ్నియందు వేయఁబడిన యాహుతి సూర్యుని బొందును, సూర్యునివలన వర్షము, వర్షమువలన నన్నము, అన్నమువలనఁ బ్రజలు గలుగుదురు.) అని స్మృతి, లేక, అధికమైన సర్వకర్మఫలరూపమైన వర్షముగలవాడవు 'అహంహిసర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ' (నేనేగదా సమస్తయజ్ఞములకును భోక్తను ప్రభుండను) అని స్మృతి, 'ఫలమత ఉపపత్తేః' (ఉపపత్తివలన, ఈయీశ్వరునివలననే కర్మఫలముగలుగునని సిద్ధమగుచున్నది) అని శ్రీశారీరకమీమాంసాసూత్రము, అపాంమిత్రః-జలములకు స్నేహి

* 'విన్ధ్యవీథిః ప్లవంగమః' ఇతి పాఠాంతరమ్.

తుఁడవు, జలములను వర్షించువాఁడవనుట, లేక, సముద్రజలంబుల శయనించియుండు వాఁడవనుట, 'వింధ్యవీథీప్లవంగమః' వింధ్యవీథీ-వింధ్యపర్వతముయొక్క మార్గమునందు, అనఁగా ఆకాశమార్గమునందు, ప్లవంగమః-శీఘ్రముగాఁ బోవువాఁడవు, లేక, వింధ్యవీథీ-వింధ్యవీథివలె దుర్గమమైన సుషుమ్నామార్గమునందు, ప్లవంగమః-శీఘ్రముగా భక్తులనుబోవునట్లు జేయువాఁడవు, భక్తులకు సుషుమ్నామార్గమున మనోవాయుధారణము గలిగి మోక్షముగలుగునట్లు అనుగ్రహము సేయువాఁడవనుట, పాఠాంతరపక్షమందు విథ్యవీథిః-(దక్షిణాయనమందు) వింధ్యపర్వతము మార్గము గాఁగలవాడవు, లేక, సుషుమ్నమార్గము గాఁగలవాఁడవు, సుషుమ్నామార్గమును బొందినవారలే నిన్నుఁ బొందఁగలవారనుట, ప్లవంగమః – శీఘ్రముగా నడచువాఁడవు, లేక, శీఘ్రముగాఁ బొందించువాఁడవు, సమస్తకర్మఫలంబులను తప్పక యొసంగు వాఁడవనుట.

శ్లో॥ ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః।
కవిర్విశ్వో మహాతేజా రక్తస్సర్వభవోద్భవః॥ ౧౪

టీక. త్వం (అధ్యాహృతము)-నీవు, ఆతపీ- ఎండగలవాఁడవు, లేక, ఆసమంతాత్ తపఃఅస్యఅస్తి-మిక్కిలియు తపము అనఁగా జ్ఞానముగలవాడవు, 'యస్యజ్ఞానమయంతపః' అనిశ్రుతి. మండలీ-గుండ్రమైన ఆకారము గలవాఁడవు, లేక, మండ్యతే అనేనేతిమండలం. అనఁగా భూషణము, అదికలవాఁడవు, కౌస్తుభాదిభూషణములు గలవాఁడవనుట, మృత్యుః – శత్రులఁజంపువాఁడవు, పింగళః – ఉదయకాలమందు గోరోజనపువన్నె గలవాఁడవు, లేక, పింగతి – కలియువాఁడవు, సర్వవ్యాపకుఁడవనుట, సర్వతాపనః-(మధ్యాహ్నమునందు) సమస్తమును తపింపఁజేయువాఁడవు, లేక, ఏకకాలమునందే సమస్తబ్రహ్మాండమును సంహరించువాఁడవు, కవిః-పండితుఁడవు, వ్యాకరణము మొదలైన సమస్తశాస్త్రములను ప్రవర్తింపఁజేసినవాఁడవనుట; లేక; సర్వజ్ఞుఁడవనుట 'యస్సర్వజ్ఞ స్సర్వవిత్' అనిశ్రుతి. విశ్వః-సమస్తమును నిర్వహించువాడవు; లేక; సమస్తమును శరీరముగాఁగలవాడవు 'విశ్వమేవేదంపురుషః' అనిశ్రుతి. మహాతేజాః-అధికములైన కాంతులుగలవాఁడవు, లేక, అధికమైన యితరులజయించు సామర్థ్యము గలవాఁడవు; రక్తః-భక్తులయం దనురాగము గలవాఁడవు, సర్వభవోద్భవః-సమస్తములైన కార్యములకు కారణభూతుఁడవు; లేక, అందఱియొక్కయు సంసారమునకు కారణభూతుఁడవు.

శ్లో॥ నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః।
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోస్తుతే॥ ౧౫

టీక. త్వం(అధ్యాహృతము)-నీవు; నక్షత్రగ్రహతారాణాం-అశ్విన్యాదినక్షత్రములకు గ్రహములకు సాధారణనక్షత్రములకును, అధిపః - నాథుఁడవు, నక్షత్రగ్రహములయందును అంతర్యామి యైనవాఁడవనుట, విశ్వభావనః - ప్రపంచమును నిలుపువాఁడవు; 'ద్యౌస్స చంద్రార్క నక్షత్రం ఖందిశో భూర్మహోదధిః, వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః' (స్వర్గము; చంద్రసూర్య నక్షత్రములతోఁ గూడిన ఆకాశము, దిశలు, భూమి, సముద్రము ఇవన్నియు మహాత్ముం డగువాసుదేవుని వీర్యముచేతనే నిలిచియున్నవి) అని మహాభారతము. తేజసామపి-తేజస్సులకు గూడ; తేజస్వీ - అధిక తేజస్సుగలవాఁడవు, సమస్తతేజస్సులను అణఁచివేయునట్టి మహాతేజస్సు గలవాఁడ వనుట, ద్వాదశాత్మన్-పండ్రెండుమూర్తులు గలవాఁడా! 'ఇంద్రోధాతా భగః పూషా మిత్రోథ వరుణోర్యమా, అర్చిర్వివస్వాన్ త్వష్టాచ సవితా విష్ణురేవచ' (ఇంద్రుఁడు ధాత భగుఁడు పూషుఁడు మిత్రుఁడు వరుణుఁడు అర్యముఁడు అర్చిస్సు వివస్వంతుఁడు త్వష్ట సవిత విష్ణువు) అని ద్వాదశాదిత్యులు. ఈద్వాదశాదిత్యులయందు అంతర్యామియై యుండువాఁడా! అనుట. తస్మై (అధ్యాహృతము)-అట్టి, తే-నీకొఱకు, నమః-నమస్కారము; అస్తు-అగుఁగాక; నీవు ఇట్టి విశేషణములు గలవాఁడవు. ఇట్టి సమస్తకల్యాణగుణములు గల నీకు నమస్కారముఁ జేసెదననుట.

శ్లో॥ నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతి ర్గణానాం పతయే దినాధిపతయే నమః॥ ౧౬

టీక. పూర్వాయ-తూర్పుదిశనుండునట్టి, గిరయే-పర్వతమైన, తూర్పుకొండయందున్నయనుట; లేక, తూర్పుకొండయం దంతర్యామివై యున్న, తే(అధ్యాహృతము ఇట్లు ముందును)-నీకొఱకు; నమః-నమస్కారము, పశ్చిమే-పడమటిభాగమందు, గిరయే - పర్వతమైన, పడమటికొండయం దుండునట్టి యనుట; లేక, పడమటికొండయొక్క అంతర్యామివైన; తే-నీకొఱకు, నమః-నమస్కారము; జ్యోతిర్గణానాం పతయే-జ్యోతిస్సమూహములయొక్క నాథుఁడవైన, లేక, ముక్తులగువారల సమూహములయొక్క నాథుఁడవైన; ముక్తులకుఁ బ్రాప్యస్థానమైన, తే-నీకొఱకు; నమః (అధ్యాహృతము)-నమస్కారము, దినాధిపతయే - పగటికిఁ బ్రభుఁడవైన, లేక,

పగటినిజేయునట్టి సూర్యునియందు అంతర్యామివైన, తే-నీకు, నమః-నమస్కారము.

తా॥ తూర్పుకొండపైనున్న నీకు నమస్కారము, పడమటికొండపై నున్న నీకునమస్కారము. (తూర్పు పడమటికొండలయందు అంతర్యామివైన నీకు నమస్కారము) జ్యోతిర్గణములకు నాథుఁడవగు నీకు నమస్కారము. (ముక్తులగు వారలకుఁ బ్రాప్యస్థానమగు నీకు నమస్కారము) దినమును జేయునట్టి నీకు నమస్కారము. (సూర్యమండలాంతర్యామి వగు నీకు నమస్కారము).

శ్లో॥ జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః ।
నమోనమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః॥ ౧౭

టీక. జయాయ-జయించువాఁడ వగు అప్రతిహతమైన పరాక్రమము గలవాడ వనుట, లేక, 'జయంతి అనేన సద్భక్తా స్సంసారం'(భక్తులు ఈతనిచే సంసారమును జయింతురు)భక్తులనుసంసారమునుజయించునట్లు చేయువాఁడవగు, (అధ్యాహృతము) తే - నీకొఱకు, నమః-నమస్కారము, జయభద్రాయ - జయమును మంగళమును యిచ్చునట్టి, తే-నీకొఱకు, నమః-నమస్కారము,హర్యశ్వాయ-ఆకుపచ్చని గుఱ్ఱము గలసూర్యునియొక్క అంతర్యామివైన యనుట,లేక,హరి-మనోహరమైన,అశ్వాయ-వాహనముగల, మనోహరమైన గరుడవృషభాదివాహనములు గలవాఁడ వనుట, ఇది యాదిత్యమండలాంతర్వర్తి పురుషవిషయక మవుటంజేసి, యాదిత్యవాచకశబ్దంబులు పలుమారు ప్రయోగింపఁబడినవి, స్తోత్రమవుటవలనను, పునరుక్తము దోషముకాదు. తే-నీకొఱకు, నమఃనమః-నమస్కారము నమస్కారము, సహస్రాంశో-వేయికిరణములుగల సూర్యుని యంతర్యామివైనవాఁడా! లేక, మితిలేని తేజస్సుగలవాఁడా! లేక, వేయిజీవులు గలవాఁడా! సమస్తజీవులును నీయొక్క అంశములనుట 'మమైవాంశో జీవలోకే జీవభూతః' (నాయొక్క అంశమే జీవలోకమందు జీవుడయినది) అని చెప్పఁబడియున్నది. తే-నీకొఱకు, నమోనమః-నమస్కారము నమస్కారము, ఆదిత్యాయ-సూర్యుఁడవైన సూర్యమండలంబునందు, అంతర్వర్తివైన, తే-నీకొఱకు, నమోనమః-నమస్కారము నమస్కారము, 'నమోనమః' అని రెండుమాఱులు ఆదరాతిశయమునం జెప్పఁబడినది.

తా॥ అప్రతిహతమైన పరాక్రమము గలవాఁడవగు నీకు నమస్కారము గావించెదను. (భక్తులకు సంసారజయంబు నొసంగించువాడవైన నీకు నమస్కారము చేసెదను) జయంబును మంగళంబును ఒసంగువాఁడవైన నీకు వందనము గావించెదను, హరి

తవర్ణమగు గఱ్ఱముగల సూర్యునియందు నంతర్యామివైన నీకుఁ బ్రీతియొనర్చెదను. (మనోహరములగు గరుడవృషభాదివాహనములుగల నీకు మ్రొక్కెదను) వేయికిరణంబులు గల సూర్యునియం దంతర్యామివైనవాఁడా! (నీయంశమువైన సమస్తజీవులకు నాధారభూతుఁడా) నీకుఁ బ్రణామంబు గావించెదను, ఆదిత్యమండలంబున యోగులచేఁ జూడఁబడునట్టి నీకభివందనము చేసెదను.

శ్లో॥ నమః ఉగ్రాయ వీరాయ సారంగాయ నమోనమః।
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమోనమః॥ ౧౮

టీక. ఉగ్రాయ-(ఉపాసకులు కానివారలకు) భయంకరమైన రూపముగల, తే(అధ్యాహృతము)-నీకొఱకు, నమః-నమస్కారము, వీరాయ - 'ప్రాణినః వివిధం ఈరయతి' ప్రాణులను నానావిధముగాఁ బ్రేరించువాఁడవైన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, సారంగాయ - సారంగచ్ఛతి, శీఘ్రముగా నడచువాఁడవైన, అర్ధనిమిషంబునకు సూర్యుఁడు రెండువేలయోజనంబులు పోవునని పురాణప్రసిద్ధము, లేక, సారమును బొందువాఁడవైన, సారమును గ్రహించువాఁడవైన యనుట, లేక, ప్రణవమును బొందువాఁడవైన ప్రణవప్రతిపాద్యుఁడవైన యనుట, లేక, సారంగాయ-హంసావతారరూపుఁడవైన, తే-నీకొఱకు, నమఃనమః-నమస్కారము నమస్కారము, పద్మప్రబోధాయ-కమలములను వికసింపఁజేయు వాఁడవైన, హృదయకమలమును వికసింపఁజేయువాఁడవైన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, మార్తాండాయ - మృతేఅండేజాతః, బ్రహ్మాండము మృతమైనప్పుడు (మఱల సృజించుటకు) పుట్టిన వాఁడవైన, తే-నీకొఱకు, నమఃనమః-నమస్కారము నమస్కారము.

తా॥ ఉపాసకులు కానివారలకు భయంకరుఁడవైన నీకు నమస్కారము, సర్వప్రాణులను తత్తత్పూర్వకర్మానురూపంబుగాఁ గర్మములయందుఁ బ్రేరించువాఁడవైననీకు నమస్కారము, శీఘ్రముగా నడచువాఁడవైన (సారమును గ్రహించువాఁడవైన, ఓంకార ప్రతిపాద్యుఁడవైన, హంసావతారరూపుఁడవైన) నీకు నమస్కారము, కమలములను వికసింపఁ జేయువాఁడవైన (భక్తుల హృదయకమలమును సదా వికసింపఁ జేయువాఁడవైన) నీకునమస్కారము, బ్రహ్మాండము ప్రళయము నొందినపుడు మరలసృజించుటకై యున్నవాఁడవైన నీకు నమస్కారము.

శ్లో॥ బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్య వర్చసే।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషేనమః॥ ౧౯

టీక. బ్రహ్మేశానాచ్యుతేశాయ-బ్రహ్మదేవునికిని శివునకును విష్ణువునకును నియామకుఁడవైన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, సూర్యాయ - ప్రాణులను కర్మములందుఁ బ్రేరించువాఁడవైన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, ఆదిత్యవర్చసే-సూర్యరూపమైన కాంతిగలవాఁడవైన, లేక, సూర్యమండలమందుఁ దేజోరూపుఁడవైన, తే-నీకు, నమః - నమస్కారము, భాస్వతే- తేజస్సు గలవాఁడవయిన, సమస్త పదార్థములయందును తేజస్సు కలిగించువాఁడవయినవాఁడనుట; తే - నీకొఱకు, నమః - నమస్కారము, సర్వభక్షాయ-సమస్తమును భక్షించువాఁడవయిన, సర్వమును సంహరించువాఁడవయిన యనుట; తే-నీకొఱకు.నమః-నమస్కారము, కావున నే ఆకాలమందు, రౌద్రాయ-భయంకరమైన, వపుషే- శరీరమైన, భయంకరమైన యాకారము గలవాఁడవనుట, తే-నీకొఱకు, నమః-నమస్కారము.

తా॥ బ్రహ్మ విష్ణు శివులకును నియామకుఁడవై పరబ్రహ్మరూపుఁడవైన నీకు నమస్కారము, సమస్తప్రాణులను అహ్నికకర్మంబులందుఁ బ్రేరించువాఁడవైన నీకు నమస్కారము, సూర్యమండలమునందుఁ దేజోరూపుఁడవైన నీకు నమస్కారము, సమస్తతేజస్సులకును గారణమైన మహాతేజస్సు గలవాఁడవైన నీకు నమస్కారము, ప్రలయకాలమున సమస్తమును సంహరించువాఁడవయిన నీకు నమస్కారము, అప్పుడు భయంకరమైన యాకారముగలవాఁడవైన నీకు నమస్కారము.

శ్లో॥ తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయా ఽమితాత్మనే।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః॥ ౨౦

టీక. తమోఘ్నాయ - చీకటిని బోఁగొట్టువాఁడవయిన, లేక, అజ్ఞానమును బోఁగొట్టువాఁడవయిన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, హిమఘ్నాయ-మంచును బోఁగొట్టువాఁడవయిన, లేక, హిమ మనఁగా శీతము, ఇది యుష్ణమునకు నుపలక్షకము, శీతోష్ణమును బోఁగొట్టువాఁడవయిన, భక్తులకు శీతోష్ణాదిద్వంద్వములను నోర్చు శక్తి నొసంగువాఁడవయిన యనుట, తే-నీకు; నమః-నమస్కారము; శత్రుఘ్నాయ-ఆశ్రితులయొక్క శత్రువులను వధించువాఁడవయిన, లేక; శత్రుభూతములైన ఇంద్రియములను వధించువాఁడవయిన, ఆశ్రితులకు ఇంద్రియముల నిగ్రహించుశక్తి నొసంగువాఁడవయిన యనుట, తే-నీకొఱకు, నమః-నమస్కారము; అమితాత్మనే-పరిచ్ఛిన్నముకాని స్వరూపము గలవాఁడవయిన, దేశకాలవస్తుకృతత్రివిధపరిచ్ఛేదము లేనివాఁడవయిన యనుట, లేక, అమితమైన మహిమగలవాఁడవయిన, తే - నీకొఱకు

నమః-నమస్కారము, కృతఘ్నఘ్నాయ-కృతఘ్నులను వధించువాఁడవయిన, కృతఘ్నులనఁగా ఇతరులు తమకుఁ గావించిన యుపకారమును మఱచినవారలు, అట్టి మహాపాపులను వధించువాఁడవయిన, ఇది యుపలక్షణము, పాపము నాచరించిన వారలను శిక్షించువాఁడవయిన యనుట; తే-నీకొఱకు, నమః-నమస్కారము, దేవాయ-దీవ్యతి, సృష్టిస్థితిసంహారములచేఁ గ్రీడించువాఁడవయిన, లేక; ప్రకాశించు వాఁడవయిన, స్వయంప్రకాశుఁడవయినయనుట, తే-నీకొఱకు, నమః-నమస్కారము, జ్యోతిషాం-చంద్రసూర్యనక్షత్రాదికములయిన ప్రకాశవస్తువులకు, పతయే-ప్రభుఁడవయిన, చంద్రసూర్యాది జ్యోతిర్వర్గములకును ప్రకాశము నొసంగువాఁడవయిన యనుట, తే-నీకొఱకు, నమః-నమస్కారము.

తా॥ అంధకారమును బోఁగొట్టువాఁడవయిన (అజ్ఞానమును బోఁగొట్టువాఁడవయిన) నీకు నమస్కారము, భక్తులకు శీతోష్ణాదిద్వంద్వముల సహించుసామర్థ్యము నొసంగువాఁడవయిన నీకు నమస్కారము, ఆశ్రితుల శత్రువులను వధించువాఁడవయిన (శత్రువులైన యింద్రియములను జయించుశక్తిని భక్తులకుఁ బ్రసాదించు వాఁడవయిన) నీకు నమస్కారము, దేశకాలవస్తుకృతత్రివిధ పరిచ్ఛేద శూన్యుఁడవయిన (అపరిమిత మహిమగలవాఁడవయిన) నీకు నమస్కారము, సమస్త పాపులను విశేషించి కృతఘ్నులను శిక్షించువాఁడవయిన నీకు నమస్కారము, సృష్టిస్థితిసంహారములచేఁ గ్రీడించువాఁడవయిన (స్వయంప్రకాశుఁడవయిన) నీకు నమస్కారము, చంద్రసూర్యాది సమస్తజ్యోతిర్వర్గమునకును బ్రకాశము నొసంగుటచే నాథుఁడవయిన నీకు నమస్కారము.

శ్లో॥ తప్తచామీకరాభాయ * వహ్నయే విశ్వకర్మణే।
నమస్తమోభినిఘ్నాయ ♦ రుచయే లోకసాక్షిణే॥ ౨౧

టీక. తప్తచామీకరాభాయ-కాఁచఁబడిన బంగారముయొక్క కాంతివంటి కాంతిగలవాఁడవయిన, తే-నీకు, నమః-నమస్కారము, వహ్నయే - అగ్నిరూపుఁడవయిన, లేక, సమస్తలోకములను వహించువాఁడవయిన, హరయే(పాఠాంతరము)-పాపములను హరించువాఁడవయిన, తే-నీకు, నమః-నమస్కారము, విశ్వకర్మణే-జగత్తు కార్యముగాఁ గలవాఁడవయిన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, తమోభినిఘ్నాయ-అంధకారమును బోఁగొట్టునట్టివాఁడవయిన, లేక, అజ్ఞానమును బోఁగొ

పాఠాంతరము.— * హరయే. ♦ ఘృణయే.

ట్టువాఁడవయిన, తే-నీకొఱకు, నమః-నమస్కారము, రుచయే-ప్రకాశస్వరూపుఁడవయిన, ఘృణయే(పాఠాంతరము)-ప్రకాశస్వరూపుఁడవయిన, తే-నీకొఱకు; నమః-నమస్కారము; లోకసాక్షిణే-జనులకు సాక్షిభూతుఁడవయిన, సమస్త కర్మలకును సాక్షిభూతుఁడవైన యనుట, తే-నీకొఱకు, నమః-నమస్కారము.

తా॥ మేలిమిబంగారువంటి మేనుగలవాఁడవైన నీకు నమస్కారము, అగ్నిరూపుఁడవైన (సమస్తలోకములకును ఆధారభూతుఁడవైన) నీకు నమస్కారము, (పాఠాంతరపక్షమందు) సమస్తపాపములను హరించువాఁడవైన నీకు నమస్కారము, అంధకారమును నశింపఁజేయువాఁడవైన (అజ్ఞానమును నశింపఁజేయువాఁడవైన) నీకు నమస్కారము, సమస్తమునందుఁ బ్రకాశరూపుఁడవైన (స్వయం ప్రకాశరూపుఁడవైన) నీకు నమస్కారము, లోకులుచేయు సమస్తకర్మములకు సాక్షిభూతుఁడవైన నీకు నమస్కారము.

శ్లో॥ నాశయ త్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః।
పాయ త్యేష తప త్యేష వర్ష త్యేష గభస్తిభిః॥ ౨౨

టీక. ప్రభుః-సమస్తమునకును నియామకుండవైన, ఏష వై-ఈమహాపురుషుఁడే, భూతం-జగత్తును, నాశయతి-నశింపఁజేయుచున్నాఁడు, తదేవ-ఆజగత్తునే, సృజతి-సృజించును, ఏషః-ఈతఁడు, గభస్తిభిః-కిరణములచేత, పాయతి-శోషిల్లఁజేయును, తపతి-తపింపఁజేయును, వర్షతి-వర్షించును.

తా॥ సర్వలోకనియామకుఁడైన యీదేవుండే సమస్తప్రపంచమును ప్రళయకాలంబున సంహరించును, మఱల నాప్రపంచమునే సృజించును, ఈతఁడే కిరణములచేఁ దాపము గల్గించి శోషిల్లఁజేయును, వర్షంబునుఁ గురియించును.

శ్లో॥ ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః।

టీక. ఏషః-ఇతఁడు, భూతేషు-ప్రాణులు, సుప్తేషు-నిదురించియుండఁగా, పరినిష్ఠితః-అంతటను వ్యాపించినవాఁడై, జాగర్తి-మేలుకొనియుండును.

తా॥ భూతంబులు నిద్రించియున్నప్పుడును, ఈతఁడు, ఆభూతంబుల యన్నిటియందును అంతర్యామిత్వంబున వ్యాపించినవాఁడై మేలుకొనియుండును.

శ్లో॥ ఏష ఏవాగ్నిహోత్రంచ ఫలం చైవాగ్నిహోత్రిణామ్॥ ౨౩

టీక. ఏష ఏవ ఈతఁడే, అగ్నిహోత్రంచ-అగ్నిహోత్రమను కర్మమును, అగ్నిహోత్రిణాం - అగ్నిహోత్రము గలవారలయొక్క, అగ్నిహోత్రము చేయువారలయొక్క, ఫలం చైవ-ఫలమును.

తా॥ అగ్నిహోత్రమును అగ్నిహోత్రముయొక్క- ఫలమును ఈమహాపురుషుడే.

శ్లో॥ వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవచ ।

టీక. ఏషః(అధ్యాహృతము)-ఈతఁడు, వేదాశ్చ - వేదములును; క్రతవశ్చ-యజ్ఞములును; క్రతూనాం-యజ్ఞములయొక్క-, ఫలమేవచ ఫలమును.

తా॥ ఇతఁడే వేదములు, ఇతఁడే యజ్ఞములు, యజ్ఞములచేఁ బొందఁదగిన ఫలమును ఇతఁడే.

శ్లో॥ యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః॥ ౨౮

టీక. లోకేషు-లోకములయందు, కృత్యాని-కార్యములు, యాని(సంతి)-ఏవి కలవో, తేషాం(అధ్యాహృతము)-వానికి, సర్వః-సమస్తాత్మకుఁడైన, ఏషః - ఈ రవిః-సూర్యమండలాంతర్వర్తియగుపురుషుఁడు, ప్రభుః-నియామకుఁడు.

తా॥ మఱియు లోకంబున నేయేకర్మములు చేయఁబడుచున్నవో; వానికన్నిటికిని; సర్వాత్మకుఁడైన సూర్యమండలాంతర్వర్తియగు హిరణ్మయపురుషుఁడే నియామకుఁడును ఫలప్రదాతయు.

శ్లో॥ ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషుచ।
కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ॥ ౨౯

టీక. రాఘవ-రాముఁడా! పురుషః-పురుషుఁడు, కశ్చిత్-ఒకానొకఁడైనను, ఆపత్సు-ఆపదలయందును, కృచ్ఛ్రేషు-కష్టములయందును, కాంతారేషు-అడవులయందును; భయేషుచ-భయములయందును; ఏనం-ఈదేవుని, కీర్తయన్-కీర్తించుచున్నవాఁడై, నావసీదతి-దుఃఖింపడు.

తా॥ రాముఁడా! ఇందు వర్ణాశ్రమాద్యధికారనియమములేదు, ఎవ్వఁడైనను, ఆపదలు గలిగినపుడుగాని, కష్టమువచ్చినపుడుగాని, అడవిమార్గంబులందుగాని, యితర భయంబులు గలిగినప్పుడు గాని యీయాదిత్యహృదయ స్తోత్రమును స్మరించినచో నతండు ఆపదలంబాసి నిర్భయుండై సుఖము నొందఁగలఁడు.

శ్లో॥ పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి॥ ౩౦

టీక. త్వం-(అధ్యాహృతము)-నీవు, ఏకాగ్రః-ఒకటచెల్లిన మనస్సుగలవాఁడవై, దేవదేవం-దేవతలకును దేవుండును, జగత్పతిం-ప్రపంచమునకు నాథుండునగు ఏనం-ఈదేవుని, పూజయస్వ-పూజింపుము; ఏతత్-ఈయాదిత్యహృదయమును, త్రిగుణితం-ముమ్మాఱుగా, జప్త్వా-జపించి, యుద్ధేషు-పోరులందు, విజయిష్యసి - గెలువగలవు.

తా॥ నీవు, మనసునిశ్చలముగా నిలిపి, దేవతలకును దేవుండును జగన్నాథుండు నగు నీదేవుని, యిసూర్యాదిత్యహృదయస్తోత్రంబునం బూజింపుము, ఈసూర్యాదిత్యహృదయస్తోత్రమును మూడుమాఱులు జపింతువేని యుద్ధంబులందు జయము నొందంగలవు.

శ్లో॥ అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి ।

టీక. మహాబాహో-పెద్దచేతులు గల రాముండా! త్వం-నీవు, అస్మిన్-ఈ, క్షణే-క్షణమునందు, రావణం-రావణుని, వధిష్యసి-వధింపంగలవు.

తా॥ మహాబాహుండ వగు రాముండా! నీ వీసూర్యాదిత్యహృదయమును జపించు, ఈక్షణముననే రావణుని వధింపంగలవు. అని యగస్త్యుండు రామునకుం జెప్పెను.

శ్లో॥ ఏవముక్త్వా తదాగస్త్యో జగామచ యథాగతమ్। ౨౭

టీక. తదా-అప్పుడు, అగస్త్యః-అగస్త్యమహర్షి, ఏవం-ఇట్లు, ఉక్త్వా-పలికి, యథాగతం-వచ్చినట్లుగా, జగామచ-పోయెను.

తా॥ అంత, నగస్త్యమహర్షి, ఇవ్విధంబునం బలికి, తావచ్చినదారిం బోయెను.

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో ఽభవత్తదా ।
ధారయామాససుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్॥ ౨౮

టీక. తదా-అప్పుడు, మహాతేజాః-అధికమైన పరాక్రమముగల, రాఘవః-రాముండు, ఏతత్-దీని, శ్రుత్వా-విని, నష్టశోకః-నశించిన దుఃఖముగలవాండు, అభవత్-అయెను, సుప్రీతః-మిక్కిలియు సంతుష్టుండై, ప్రయతాత్మవాన్-పరిశుద్ధమైన మనస్సుగలవాండై, ధారయామాస-ధరించెను, ధ్యానముచేసెననుట.

తా॥ అప్పుడు, మహాతేజుం డగురాముండు; ఇమ్మహాస్తోత్రమును వినినంతనే మనసునందలి చింతవదలి, పరమసంతుష్టుండై; పరిశుద్ధమైన మనస్సుతో, ఆదిత్యహృదయ ప్రతిపాద్యుండగు దేవదేవుని ధ్యానించెను.

శ్లో॥ ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రి రాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్॥ ౨౯

టీక. వీర్యవాన్-అధికమైన పరాక్రమము గల రాముండు, ఆచమ్య-ఆచమనముచేసి, శుచిః-పరిశుద్ధుండు, భూత్వా-అయి, ఆదిత్యం-సూర్యుని, ప్రేక్ష్య-చూచి, లేక, సూర్యమండలాంతర్వర్తి హిరణ్మయ పురుషుని ధ్యానించి, త్రిః - మూడుమాఱులు, జప్త్వాతు-జపించియు, ధనుః-వింటిని, ఆదాయ - గ్రహించి, పరం - అధికమైన, హర్షం-సంతోషమును, అవాప్తవాన్-పొందెను.

తా॥ రాముండు, ఆచమనము చేసి; శుచియై, సూర్యుంజూచుచు (ఆదిత్యమండలాంతర్వర్తి పరమాత్మను ధ్యానముచేయుచు) మువ్మారు ఆదిత్యహృదయస్తోత్రమును జపించి; యినుమడియయిన పరాక్రమంబు గలవాఁడై, పరమహర్షంబునొంది ధనుస్సు చేతంబట్టెను.

శ్లో॥ రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ॥ 38

టీక. సః(అధ్యాహృతము)-ఆరాముఁడు, రావణం-రావణుని, ప్రేక్ష్య-చూచి, హృష్టాత్మా-సంతోషించిన మనస్సుగలవాఁడై, యుద్ధాయ-పోరుకొఱకు, పోరుట కనుట, సముపాగమత్-సమీపించెను, మహతా-గొప్పదగు, సర్వయత్నేన-సమస్త ప్రయత్నముచేత, తస్య-ఆరావణునియొక్క, వధే-చంపుటయందు ధృతః-నిశ్చయించినవాఁడు, అభవత్-అయ్యెను.

తా॥ రాముండు, అంత రావణుంజూచి సంతుష్టుండై, సమస్త ప్రయత్నంబుల నతని వధింప నిశ్చయించి యుద్ధంబుసేయుటకై సమీపించెను.

శ్లో॥ అథ రవి రవద న్నిరీక్ష్య రామం ।
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ॥
నిశిచరపతిసంక్షయం విదిత్వా ।
సురగణమధ్యగతో వచ స్త్వరేతి ॥ 39

టీక. అథ-అటుపిమ్మట, రవిః-సూర్యుఁడు, సూర్యమండలాంతర్వర్తి హిరణ్మయపురుషుఁడనుట, ముదితమనాః-సంతసించిన మనస్సుగలవాఁడై, పరమం-మిక్కిలియు, ప్రహృష్యమాణః-గగుర్పాటునొందినవాఁడై, సురగణమధ్యగతః-దేవసమూహముయొక్క మధ్యభాగము నొందినవాఁడై, రామం-రాముని, నిరీక్ష్య-చూచి, 'నిశిచరపతిసంక్షయం-రాక్షసరాజైన రావణుని నాశమును, విదిత్వా - తెలిసి, త్వర-వేగిరిపడుము,' ఇతి-అని, వచః-మాటను, అవదత్-పలికెను.

తా॥ అట్లు, రాముండు జపధ్యానపరాయణుండగుటయు, సూర్యమండలాతర్గతుండైన హిరణ్మయుండగు నమ్మహాపురుషుండు, తన్ను దేవతాసమూహం పరివేష్టించి కొలువఁ బరమసంతుష్టుండై పులకితదేహుండై, రామునకుం బొడసూపి రామునింజూచి, "రాక్షసరాజగు రావణుండు నాశము నొందఁగలఁడని తెలియుంగుము, జాగుసేయక పోరుము" అని పలికెను.

గ్రంథము సమాప్తమ్.